చదవతగ్గ పుస్తకం

# A Suitable Boy

– కోమల. వి

(గ్రంథకర్త విక్రమ్‌సేథ్ కవి, రచయిత, నవలా కారుడు. కలకత్తాలో జన్మించాడు. ఆక్స్‌ఫర్డ్, స్టాన్‌ఫర్డ్, నాన్‌జింగ్ యూనివర్సిటీలలో విద్యాభ్యాసం గావించాడు. చైనాలో రెండు సంవత్సరాలు జనాభా – ఆర్థిక విశ్లేషణ మీద పరిశోధన జరిపాడు. ఐదు పద్యకావ్యాలు ప్రచురించాడు. సింకియాంగ్, టిబెట్‌లో తన ప్రయాణ అనుభవాలు గ్రంథీకరించాడు. 'ది గోల్డెన్ గేట్' అనే నవలను పద్యరూపంలో రచించి చదువరులకు మిక్కిలిగా పరిచయమయ్యాడు. A Suitable Boy విక్రమ్‌సేథ్ వ్రాసిన ఆధునిక నవల. దీని ద్వారా రాసి వాసి గడించాడు. ప్రస్తుతానికి A Suitbale Girl వ్రాయాలనే ఆలోచనను పక్కకు పెట్టాడు!)

విక్రమ్‌సేథ్ రచించిన 'అ సూటబుల్ బోయ్' (A Suitbale Boy) చాలా సుదీర్ఘమైన నవల. ఇతివృత్తం, భాష, శైలి ఎంతో చక్కగా ఉండి చదువరులను ఆకట్టు కుంటుంది. ఇందులోని ఏ భాగం విసుగు పుట్టించదు. దాటవేసి తరువాత భాగానికి త్వరగా పోవాలని అనిపించదు. కొన్ని కొన్ని వాక్యాలు వెనుదిరిగి మరల చదవాలనిపిస్తుంది. ప్రతి మాట చదివి ఆకళింపు చేసుకుంటేనే తృప్తి కలుగుతుంది. ఒక భారతీయునికి ఇంగ్లీషు భాషమీద ఇంత పట్టు ఉండటం అబ్బురంగా ఉంటుంది. ముద్రణ బాగుండటం, చక్కని పేపరు వాడటం వలన కంటికి ఇంపుగా ఉంటుంది చదివినంత సేపు. ముందే నవలా కారుని గురించి, నవల గురించి దిన పత్రికలలో విస్తృతంగా ప్రచురించారు. రచయితకు భారీగా పారితోషికం అందినట్లు, లక్షలప్రతులు అమ్ముడు పోయినట్లు పత్రికా ముఖంగా తెలుసుకున్నప్పటి నుండి నవల చదవాలనే కుతూహలం కలిగింది. చదివాక ఈ నవల గురించి, రచయిత గురించి చదివినవి వాస్తవాలని తెలుసుకుంటాం.

A Suitbale Boy చదవటంలో మనం చిన్న ఇబ్బందులు ఎదుర్కొంటాం. వాల్యూం పెద్దదవటం మూలాన పడుకొని విశ్రాంతిగా చదవుదాం అంటే వీలుపడదు. ఎంత సేపు చదివినా పరిక్షలకు చదివే విద్యార్థిలా నిటారుగా కూర్చొని చదవవలసిందే. పేపరు సున్నితమైంది గనుక పేజీలు తిప్పేటప్పుడు జాగ్రత్త వహించవలసి ఉంటుంది.

ఈ నవలలో ఎంతో మంది వ్యక్తులు తారసిల్లుతారు. వారందరి పేర్లు సందర్భాను సారంగా గుర్తు పెట్టుకోవటం కొంత మేర చదివేదాక కష్టంగా ఉంటుంది. పోనుపోను ఆ చిక్కునధిగమిస్తాం. ముందేమవుతుంది అనే ఆతురతతో చదువుతాం. A Suitable Boy చదవదగ్గ పుస్తకం. ఇది అన్ని కాలాలకు వర్తిస్తుంది. మధ్య మధ్య కీర్తిగడించిన కవుల కవిత్వంతో, గజళ్ళతో ఆసక్తికరంగా నడుస్తుంది నవల.

'అ సూటబుల్ బోయ్' (A Suitable Boy) నేటి మన సమాజ జీవితానికి అద్దం పట్టినట్లున్నది. ఈ అసాధారణమైన నవలలో కథ లతకు ఆమె తల్లి రూపామెహరా తగిన వరుణ్ణి వెతకటం గురించి ఐనా, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత దేశపు స్థితిగతులను ఎత్తిచూపిస్తుంది. దేశంలోని కరువుకాటకాలు, జమీందారుల ఆస్తులు తరిగి, కరిగి పోవటం,

ఆర్టిస్టులు, డబ్బున్న వారిని రంజింప చేసే వారి పరిస్థితుల్లో మార్పు, రాజకీయ మార్పులు, ఎన్నికలు ఇలా అనేక విషయాలు ఈ నవలలో చర్చకు వస్తాయి.

నవలలో కథ అంతా విస్తృతమైన నాలుగు కుటుంబాల చుట్టూ పెనవేసుకుని ఉంటుంది. మెహరాలు, కపూర్లు, ఛటర్జీలు, ఖాన్‌లు - ఈ నాలుగు కుటుంబాల జీవిత సరళి, మార్పులు చేర్పులు, వారి ఆర్థిక, సామాజిక, రాజకీయ స్తోమత వారి మంచితనం, వారి వారి ఆవేశ, కావేశాలు, వారి మధ్య స్నేహ - సౌభ్రాతృత్వం ఈ నవలలోని ఇతివృత్తంగా ఉంటుంది. ముచ్చటగొలిపే సభ్యత, భయాన్ని రేకెత్తించే హింస, ప్రేమ వ్యవహారాలు, ఇష్టాలు, అయిష్టాలు, హాస్యం, విచారం ఒకటేమిటి, మానవ నైజాన్ని బహు కోణాల్లో ఈ నవల చూపిస్తుంది.

మహేష్‌కపూర్ పూర్వ ప్రదేశ్ కాంగ్రెసు ప్రభుత్వంలో రెవిన్యూ మంత్రి. నివాసం బ్రహ్మపూర్. ఆయన మితభాషి, కోపిష్టికూడా. పండిట్ నెహ్రూకి సన్నిహితుడు. ప్రజల గౌరవాన్ని చూరగొన్న పెద్దమనిషి. మంచి స్నేహ పాత్రుడు. బైతర్ నవాబ్ ఖాన్ గారి కుటుంబంతో వెనుకటి నుండి స్నేహ సంబంధాలు గలవాడు. జమిందారీ ఆస్తులు రద్దు చేయాలని అసెంబ్లీలో బిల్లు పెట్టి నెగ్గించినవాడు. అది ఎలా అమలు పరచాలా అని నిరంతరం ఆలోచన చేసే వాడాయన. ఈ బిల్లువల్ల తన ప్రాణస్నేహితునికి నష్టం వాటిల్లుతుందనే బాధ మనసును కెలికినా ప్రజలమంచి కోసం అది అమలు కావాలని కోరుకున్నాడు. భార్య శ్రీమతి కపూర్ ఏ విషయంలోనైనా సలహా ఇవ్వబోయినా వినే ఓపికగూడా ఉండదు ఆయనకు. ఆమె చనిపోయిన తరువాత అప్పుడప్పుడు అనుకొనే వాడు ఆమె మాటల్లోగూడా కొంత మంచి లేక పోలేదని. తన పార్టీవారి ప్రవర్తన, తీరునచ్చక ఒక సందర్భంలో రెవిన్యూ మంత్రిగా రాజీనామా చేసినా, ఎన్నికల సమయానికి, స్నేహితుల, అనుభవజ్ఞుల సలహా మీద కాంగ్రెసు టిక్కెట్టుతో నిలబడి ఎన్నికల్లో ఓటమి చవిచూస్తాడు. ఐనా తన పార్టీకి, తన ప్రజలకు సేవ చేయాలనే పట్టుదల చూపిస్తాడు.

శ్రీమతి మహేష్‌కపూర్ సాధ్వి, భక్తిపరాయణురాలు. పతిసేవ, పిల్లల పెంపకం, తమ ఇల్లైన ప్రేమనివాస్‌ను అందమైన నందనవనంగా తీర్చిదిద్దటం, పలురకాల పూల మొక్కల పెంపకం, అతిథి సత్కారం ఇవన్నీ కలపోసి చూస్తే శ్రీమతి కపూర్ అవుతుంది. తన చిన్న కొడుకు మాన్ చేసిన ఒక తప్పుకు తట్టుకోలేక అకస్మాత్తుగా మరణిస్తుంది. బ్రహ్మపూర్ అంతా ఆమెకు నివాళులర్పిస్తుంది.

మహేష్ కపూర్ పెద్ద కుమారుడు ప్రాణ్ కపూర్ ఆంగ్లంలో డాక్టరేట్ పట్టాపుచ్చుకొని బ్రహ్మపూర్ యూనివర్సిటీలో ఆంగ్ల భాషబోధిస్తూ ఉన్నాడు. మనిషి నల్లగా పీలగా ఉండి ఆస్తమా వ్యాధి వల్ల బలహీనంగా ఉంటాడు. తన వృత్తిపట్ల శ్రద్ధ, గౌరవం గలవాడు. నెమ్మదస్తుడు. సహృదయుడు. మెహరా కుటుంబంలోని సవితాతో ప్రాణ్ వివాహం జరుగుంతుంది. వారిది అనకూల మైన దాంపత్యం. వారి సంతానం చిన్నారి ఉమ.

మహేష్ కపూర్ రెండవ కుమారుడు మాన్ కపూర్ అందగాడు, మాటకారి, విలాసవంతుడు, స్నేహశీలి. కొన్ని కొన్ని విషయాలలో నిలకడలేని వాడనిపిస్తాడు. తండ్రి బలవంతంతో బెనారస్‌లో బట్టల వ్యాపారం ప్రారంభిస్తాడు. కాని దాని పట్ల కించిత్తయినా ఇష్టం లేక పోవటంతో మానేస్తాడు. బెనారస్ నివాసితో అతనికి పెండ్లి నిశ్చయం జరుగుతుంది గాని చివరకు పెండ్లి జరగదు. ఆడపిల్లల స్నేహాలు, వేశ్యావృత్తిలో ఉన్న సయీదా బాయిపై మోహం, అతని లెక్క లేని తనం తండ్రికి కోపకారణం అవుతుంది. ఎన్నికల ప్రచారానికి వెళ్ళినప్పుడు మాన్‌ను పల్లె ప్రజలు గౌరవించటం, అతన్ని అందరూ ఇష్టపడటం చూచి

తండ్రి మహేష్ కపూర్ కొడుకు పట్ల తన అభిప్రాయం కొంత మార్చుకుంటాడు.

సయీదా బాయి ఇంటిలో అనుకోని విధంగా మాన్ తన ప్రాణ స్నేహితుడు ఫిరోజ్ ఖాన్‌ను చూచి అపార్థం చేసుకొని అతన్ని అనాలోచితంగా కత్తితో పొడిచి తీవ్రంగా గాయపరుస్తాడు. జైలు పాలయి, అదే స్నేహితుని దయవల్ల శిక్షను తప్పించు కుంటాడు. ఇప్పటి కుర్రకారులో కనిపించే దూకుడు స్వభావానికి మాన్ ప్రతీకగా ఉంటాడు.

మహేష్ కపూర్ కూతురు వీణ శాంత స్వభావురాలు. ఆమె భర్త కేదార్‌నాథ్ టండన్ చెప్పుల వ్యాపారి. పాకిస్తాన్, ఇండియా విభజనలో ఆస్తిపాస్తులు కోల్పోయి కేదార్‌నాథ్ కుటుంబం ప్రాణాలలో బయటపడుతుంది. ముసలి తల్లి మిసెస్ టండన్, భార్య వీణ, కుమారుడు భాస్కర్‌తో బ్రహ్మపూర్ లోని మిశ్రిమండిలో నివసిస్తాడు కేదార్‌నాథ్. భాస్కర్ అతిపిన్న వయసులోనే గణితంలో అసాధారణ ప్రజ్ఞకనబరుస్తాడు. భాస్కర్ పూల్‌మేలా (ఉత్సవం)లో తొక్కిసలాటలో గాయపడితే, ఎన్నో శ్రమల కోర్చి వీణ, కేదార్‌నాథ్ అతన్ని బ్రతికించుకుంటారు. వీణ కుటుంబం ఆర్థిక ఇబ్బందులకు గురి అయి బయటపడటానికి శ్రమిస్తుంటుంది. భర్తకు సహాయంగా ఉండాలని వీణ ప్రయత్నిస్తుంది. అత్తగారి అభిరుచుల కనుగుణంగా పోతుంది. సంగీతం ఆమెకు ప్రీతి పాత్రమైన విషయం. వీణ తల్లిదండ్రుల పట్ల, సోదరుల పట్ల ఎంతో ప్రేమగా వ్యవహరిస్తుంది.

శ్రీమతి రూపా మెహరా, భర్త రఘువీర్ మెహరా మరణించటం వల్ల కుటుంబానికి అన్ని విషయాలలో పెద్దరికం వహిస్తుంది. మనిషి పొందికగా, పద్ధతిగా ఉండటం ఆమె అలవాటు. వీలున్నప్పుడల్లా ప్రయాణాలు చేయటం. బంధువులకూ, స్నేహితులకూ ఉత్తరాలు వ్రాయటం ఆమె అలవాటు. ప్రతి విషయంలో భర్తను తలచుకొని కన్నీళ్ళు పెడుతుంది. అతనికి అలా యిష్టం, ఇలా యిష్టం అంటూనే ఉంటుంది. ఆడపిల్ల మగవారితో స్నేహాలు చేయడం, స్వేచ్ఛగా తిరగటం ఆమెకు నచ్చదు. చిన్న కూతురు లతకు తగిన వరుణ్ణి తేవటమే ఆమెధ్యేయంగా కనిపిస్తుంది. ఆమెలో ఇష్టాయిష్టాలు బలంగా పాతుకొని ఉంటాయి. కులాంతర వివాహాలు, ప్రేమ వివాహాలు ఆమె మెచ్చదు. ఆమె పెద్దకోడలు బెంగాలీ. కొడుకు తన ఇష్ట ప్రకారం పెళ్ళి చేసుకుంటాడు. వారితో సర్దుకుపోగలిగిందిగాని ఆ వివాహాన్ని మెచ్చలేదు. ఇష్టపడలేదు. తన పిల్లలు ప్రతిది తనకు చెప్పాలని, తన అభిప్రాయం తీసుకోవాలనీ కోరుకుంటుంది.

రూపామెహరా పెద్దకుమారుడు అరుణ్ మెహరా బెంటన్ ప్రైస్ కంపెనీలో ఆఫీసరు. అతనికి తన తెలివితేటలన్నా , హోదా అన్నా, సమర్థతన్నా గర్వం. ఎదుటివారిని తూలనాడగల సమర్థుడు, పెత్తనం చెలాయిస్తూ ఉంటాడు. తమ్ముడు వరుణ్ తెలివితేటల మీద ఇతనికి నమ్మకం ఉండదు. ఎప్పుడూ అతన్ని కోప్పడుతూ నీచంగా చూస్తాడు. [illegible] అభిమతానికి విరుద్ధంగా బెంగాలీ వనిత మీనాక్షీ ఛటర్జీని వివాహమాడతాడు. వారిరు[illegible] సంతానం అపర్ణ. అపర్ణ అంటే రూపామెహరాకు ప్రాణం మనుమరాలికి కోడలు బుద్ధు[illegible] రాలేదని సంతోషిస్తుంది.

అరుణ్ తమ్ముడు వరుణ్ మెహరా కలకత్తాలో అరుణ్ దగ్గర యిష్టం లేక పోయినా ఉండి చదువు కుంటుంటాడు. అన్న నిరంకుశత్వానికి భయపడి చేతగాని వాడిలా ఉంటాడు. స్నేహితులతో చౌకబారు డ్రింకు త్రాగుతూ ఉంటాడు. వెన్నెముక లేనివాడిలా భయపడుతూ ఉంటాడు. పరాధీనంగా ఉండటం వలన అలా ఉన్నాడేమో అనిపిస్తుంది. అన్న చదవడనీ, గాలికి తిరుగుతాడనీ, దేనికీ పనికిరాడని వరుణ్‌ను ఎప్పుడూ సాధిస్తూనే ఉంటాడు. వరుణ్ అన్న చీదరింపుల మధ్య తానేమి చేయాలి అనేది గూడా నిర్ణయించుకోలేక

పోతాడు. కాని నవల అంతమయ్యేటప్పటికి వరుణ్, ఐ.ఏ.ఎస్. అనిపించుకుంటాడు. అతనికి తల్లి, చెల్లెళ్ళ సానుభూతి ఎప్పుడూ లభిస్తూ ఉంటుంది. రూపామెహరా స్నేహితు రాలి కూతురు కల్పనను వరుణ్ వివాహ మాడతాడని మనకనిపిస్తుంది. రూపామెహరా ఆ విషయం మెచ్చదు.

రూపామెహరా పెద్ద కూతరు సవిత. నెమ్మదస్తురాలు, విషయ గ్రహణలోనూ, ఎవరితో ఎలా వ్యవహరించాలి అన్న విషయంలోనూ ఆమె చాలా తెలివి తేటలు కనబరుస్తుంది. ఆమె తన అన్న అరుణ్ ప్రవర్తనను ఖండిస్తూ ఉంటుంది. ఎదుర్కొంటుంది. లత వివాహ విషయంలో అరుణ్ తన అభిప్రాయాలు ఆమె మీద రుద్ద ప్రయత్నిస్తే సవిత లత తనను గురించి తానే నిర్ణయించు కోవాలని తీర్మానిస్తుంది. సవిత భర్త ప్రాణ్ అంటే ఎంతో అనురాగం చూపుతుంది. అతని అనారోగ్యం గురించి ఆతురత చెందుతుంది. అనవసర విషయాలలో కాలం వృధా పరచకుండా, అందరూ నిరుత్సాహ పరిచినా 'లా' చదవాలని నిర్ణయించు కుంటుంది. తల్లికి, చెల్లెలికి తగిన సలహాలిస్తూ అందరికీ తలలో నాలుకగా మసలుతుంది. ప్రేమించదగిన వ్యక్తిగా రాణిస్తుంది.

రూపామెహరా చిన్న కుమార్తె లత. ఆమెకు తగిన వరుణ్ణి వెతకటంలోనే నవల కథ నడచి నట్లుంటుంది. లత బ్రహ్మపూర్ యూనివర్సిటీలో ఆంగ్ల సాహిత్యం అధ్యయనం చేస్తుంది. అందమైంది, చురుకైంది. తల్లి అభిప్రాయాలతో ఏకీభవించక పోయినా, ఆమెను నొప్పించ కుండా ఉండటానికి ప్రయత్నిస్తుంది. అవసరమనుకుంటే ఎదురించగలదు. అన్న వరుణ్ అంటే సానుభూతి. అతనికి ధైర్యంగా ఎలా ఉండాలో చెపుతుంటుంది.

మాలతి అనే మెడికల్ విద్యార్థినితో ఆమె స్నేహంగా ఉంటుంది. ఒక పెళ్ళి విషయంలో లత ఆమె సలహా పాటించలేదు గాని చాలా వరకు మాలతి లతకు పెద్ద దిక్కుగా సలహాలిస్తుంటుంది. లతకు కబీర్ అనే విద్యార్థితో పరిచయం ఏర్పడుతుంది. కబీర్ అందగాడు, మంచి క్రికెటర్. అతడంటే ఇష్టం ఉన్నా, తానున్న వాతవరణంలో మతాంతర వివాహాలు సాధ్యపడవనే భయంతో తన ఇష్టాన్ని చంపు కుంటుంది.

తన తల్లి ఇష్టపడిన హరీష్ ఖన్నాతో చివరికి పెండ్లి జరుగుతుంది. తల్లి బలవంతంతో హరీష్‌తో పెళ్ళిచూపులకు ఒప్పుకుంటుంది. ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడచి ఒకరి నొకరు అర్థం చేసుకుంటారు. హరీష్ ప్రాహా షూ కంపెనీలో పని చేస్తాడు. ఇంగ్లండులో చదివి వచ్చాడు. అరుణ్ మెహరా హరీష్ అంటే చిన్నచూపు చూస్తాడు. అతన్ని చేసుకుంటే తమ కుటుంబ గౌరవానికి భంగం అని లతకు నచ్చచెప్పబోతాడు ఉత్తరం ద్వారా. తన భార్య తమ్ముడు అమిత్ ఛటర్జీని చేసుకుంటే బాగుంటుందని భావిస్తాడు. లత కబీర్, అమిత్, హరీష్‌లలో తగిన భర్తగా హరీష్‌నే ఎంచుకుంటుంది. తానే నిర్ణయం తీసుకొని హరీష్‌ని చేసుకుంటుంది. మాలతి లతకు కబీర్ అంటే ఇష్టం అని ఎరిగున్నది కనుక అతన్ని చేసుకో మని సలహా యిచ్చినా లత తన నిర్ణయం తిరగు లేనిదిగా భావిస్తుంది. అతనితో సుఖపడగలనని ఆశిస్తుంది.

ఈ నవలలో ప్రధాన ఘట్టం లతకు తగిన వరుణ్ణి వెతకటం ఐతే, ఈ నవలకు A Suitable Boy అనేది తగిన పేరే. లత వేర్వేరు సందర్భాలలో Centre of Attractionగా కనిపిస్తుంది. తాను ఇంగ్లీషు బోధనా వృత్తి చేపట్టాలనీ, పెళ్ళి తన కోరికకు అవరోధం కాదనీ నమ్ముతుంది. యువకుల సాంగత్యంలో తానెలా మసులుకోవాలో ఎరిగిన వ్యక్తి లత. తనకున్న శక్తి, యుక్తుల నుపయోగించి యూనివర్సిటీ నాటకోత్సవాలలో భాగంగా షేక్స్పియర్ నాటకం 'Twelfth Night' లో పాత్ర నటించి ఆడియన్స్‌ను ఆకట్టుకుంటుంది. లత లాంటి గుంభనగల స్త్రీలు

మనకు సమాజంలో తారసిల్లుతుంటారు. చదువు కుంటూ స్నేహితులతో కబుర్లు చెప్పు కుంటూ, మగపిల్లల్ని 'కేడ్ ' (Cadbury) అని Nick Names పెట్టుకుంటూ, పొయిట్రీ సొసైటీలో రకరకాల కవిత్వాలువింటూ, జోక్స్ చేసుకుంటూ గడుపుతున్న లత వివాహ బంధంలో ఇమిడి పోతుంది నవల చివర్లో.

లత పెండ్లి తొందర తల్లివల్లే జరిగింది. ఎప్పుడూ తగిన వాడిని చూసి లతకు పెండ్లి జరిపిస్తే బరువు తీరుతుందని ఆమె దాన్ని గురించే మాట్లాడి అన్వేషణ ప్రారంభిస్తుంది. లత కబీర్‌ను మనసారా ప్రేమించినా సాహసించదు. కారణం పిరికి తనం కాకపోవచ్చు. తల్లిని నొప్పించకుండా ఉండాలి. నిర్ణయం చేయడంలో లత ఏమీ తక్కువ బాధ పడలేదు. కొన్ని సందర్భాలలో దిక్కుతోచని స్థితిలో కొట్టుకు పోతుంది. అమిత్ గురించి ఆమె ఆట్టే ఆలోచించలే. స్నేహంగా ఊరు చూపటానికీ, కవిత్వం గురించి మాట్లాడటానికి మంచి నేస్తం, కాని వివాహ బంధంలో తనకు తగడనుకుంటుంది. ఆమె మొగ్గు కబీర్ వైపు ఉన్నా తల్లి వ్యతిరేకత, సమాజానికి ఎదురీదలేక అలా నిర్ణయించు కుంటుందేమో! హరీష్ తమ అంతస్తుకు తగడని అన్న నిరసించిన వేళ మెరపులా నిర్ణయం తీసుకుంటుంది అతన్ని భర్తగా చేసుకోవాలని. ఆమె నిర్ణయం సరైనదే అని భావించవచ్చు.

కలకత్తాలోనే జస్టిస్ ఛటర్జీ కుటుంబం ఒక వింత సమ్మేళనం. తల్లి పురాతన పద్ధతులు గలదైనా ఆమె మాట పిల్లలు అన్ని వేళలా లెక్క చేయరు. ఛటర్జీ కోర్టు వ్యవహారాలతో తీరుబాటు లేకుండా ఉంటాడు. పిల్లల స్వేచ్ఛ కద్దువస్తున్నట్లు కనిపించదు. పెద్దకూతురు మీనాక్షి ఆకర్షణీయంగా ఉంటుంది. హొయలతో, కిలకిలా మని నవ్వుతూ ఎదుటివారిని ఆకర్షిస్తుంది. అలంకరించుకొని పార్టీలకు పోవడం, స్నేహితుల్ని కలవటం ఆమె నిత్యకృత్యం. సాయంత్రాలు ఇంటి నుండి బయటపడి అర్ధరాత్రి దాక పార్టీలనీ, డాన్సులనీ భర్తవెంట తిరగటం నాగరికత అను కుంటుంది. ఇంటిని చక్కబెట్టుకోటం, బిడ్డ అపర్ణ ఆలనా, పాలనా యివేవీ ఆమెకు ముఖ్యంగా అని పించవు. Extra Marital Relationship ఆమె ఒక hobbyగా తీసుకుంటుంది. భర్త స్నేహితునితో అప్పుడప్పుడూ 'గడుపుతుంటుంది. అతడు భయపడుతున్నా బలవంతం చేసి, శాసిస్తుంది. కలకత్తా తప్ప మిగతా స్థలాలు నచ్చవు ఆమెకు. High Society Ladyగా పేరు తెచ్చుకోవాలని ఆమె తపన. అత్తగారైనా, మరెవరైనా ఆమె అవసరమనుకుంటే ఎదురించ గలదు. ఇష్టం అయితే వారిపట్ల తేనె లొలికేటట్లు మాట్లాడి ఆశ్చర్య పరచగలదు. ఇల్లు, సంసారం పట్టకుండా జీవితం హాయిగా అనుభవించటం ఆమె నిత్యకృత్యం.

మీనాక్షి తన ఆడబడుచు లతను తన తమ్ముడు అమిత్ కిచ్చి వివాహం జరపాలని తన చెల్లెలు కకోలీతో కలిసి ప్లాను వేస్తుంది. కాని లత దాన్ని ఫలించనీయ లేదు. ఏ విషయాన్నీ Seriousగా తీసుకోటం మీనాక్షి స్వభావం కాదు. ఎదుటి వారు చేస్తున్నది ఇష్టం లేదనుకుంటే వెంటనే వంట్లో బాగోలేదని, తలనొప్పి అని వంకలు పెడుతుంది. భర్త అరుణ్ ఆమె అన్నదంతా వేదంగా నమ్ముతాడు.

మీనాక్షి సాధారణ విలువలు కూడా విస్మరించి ప్రవర్తించగలదు. రూపామెహరా తన భర్త యూనివర్సిటీల్లో సంపాదించిన బంగారు పతాకాలను ఎంతో విలువగా భావించుతుంది. అలాంటి ఒక పతకాన్ని అమ్మి బంగారు నగలు చేయించు కొని, అవి పెట్టుకుని అందరికీ ప్రదర్శిస్తుంది. అరుణ్ గూడా అలా ఆమె చేసి నందుకు ఏమీ అనడు. తల్లికి ఆ విషయం అతి సాధారణమైందిగా వ్రాస్తాడు. రెండవ పతకం అరుణ్ ఇంటినుండే దొంగలు దోచుకుం టారు. రూపామెహరా ఎంతో బాధ పడుతుంది. కోడలి అ జాగ్రత్త చూచి 'ఏం మనిషి'? అనుకుంటుంది. డబ్బూ, దర్పం ఉన్న కొన్ని కుటుంబాలలలో మీనాక్షి వంటి స్త్రీలు

తరుచు మనకెదురవుతుంటారు. స్వార్థం తప్ప పరమార్థం ఎరగరేమో కొందరనిపిస్తుంది మీనాక్షిని ఉదాహరణగా తీసుకునప్పుడు.

ఛటర్జీ పెద్ద కొడుకు అమిత్ చదువు కున్నవాడు. కవిత్వం రాయటమే ఊపిరిగా అనుకుంటాడు. రాయటమే కాకుండా ఇంట్లోనూ, స్నేహితుల మధ్య కవితా గానం చేస్తుంటాడు. తండ్రి అడిగినా ఇంటి బాధ్యత, వ్యాపార బాధ్యతలు తన స్వభావానికి పడవని చెప్పేస్తాడు. పైగా తన తమ్ముడు అలాంటివి నిర్వహించ గలడేమోగాని తనను బలవంత పెట్టవద్దంటాడు. తండ్రితో అంత చనువుగా మాట్లాడి బాధ్యతలు తప్పించు కోటం ఛటర్జీ కటుంబంలోని విశేషం.

అమిత్ పెద్ద తమ్ముడు దీపాంకర్. అతనికి జీవితాన్ని ఒక వేదాంత ధోరణిలో చూడటం ఇష్టం. అతడు ఏమనుకుంటున్నాడో, ఏమి చేద్దామనుకుంటున్నాడో అతనికే తెలియదు. ఒక రోజు ఉద్యోగం చేస్తానంటాడు. మరో రోజు తనకు అలాటిది సరిపడదంటాడు. అన్న మాదిరిగానే తానూ కుటుంబ వ్యవహారాల్లో కలుగ చేసుకోనంటాడు. బాబాలు, వేదాంతుల చుట్టూ తిరగటం, వారిని ఎవో ఏవో ప్రశ్నలడగటం అతనికి యిష్టం. ఆ దృష్టితోనే బ్రహ్మపూర్‌లో జరిగే పూల్ మేలా చూడాలని వెళతాడు. రకరకాల బాబాలను చూస్తాడు. వారితో కొంత కాలం గడుపుతాడు. అక్కడ తొక్కిసలాటలో జనం చనిపోవటం, గాయప డటం చూస్తాడు. అదంతా వేదాంతధోరణిలో చూస్తాడు. ఏదో అయోమయంలో ఉంటుం టాడు. అమీత్‌తో కలసి సోదరి కకోలీని అటలు పట్టేస్తుంటాడు.

కకోలి చటర్జీ రెండవ కుమార్తె. ఆమె అంటే తండ్రికిష్టం. ఆమె స్వేచ్ఛగా తిరుగుతూ, పాటలు పాడుతూ ఇష్టమైన వారితో స్నేహాలు చేస్తూ , వదులుతూ ఉంటుంది. కథా కాలానికి హాన్స్ అనే జర్మనీ డిప్లొమాట్‌తో ప్రేమాయణం నడిపిస్తుంటుంది. ఇద్దరూ కలిసి పియానో వాయిస్తూ పాడుతూ ఉంటారు. అతన్ని వివాహ మాడతానంటుంది. మెలకువగా ఉన్న కాలంలో ఎక్కువ భాగం ఫోనులో మాట్లాడటం. కారులో తిరగటం చేస్తుంటుంది. ఆమె చేతికి ఫోను అందినా, తండ్రినడిగి కారు తీసుకున్నా అవి రెండూ ఆ రోజుకు మిగతావారికి వాడ సాధ్యపడవని రుజువు చేస్తుంది. అక్కలాగే కకోలీ కూడా అమిత్‌ని లతను వివాహమాడ మని ప్రోత్సహిస్తుంది. చదివే వారికి వారెందుకిలా చేస్తారో బోధపడదు. మీనాక్షి, కకోలీ కలకత్తాను మించి నాగరిక ప్రపంచం లేదనీ, బెంగాలీలు తప్ప మిగతా వారంత నాగరికులు కాదనీ, కలకత్తాలో తప్ప తామెక్కడా ఒక రోజు గూడా ప్రశాంతంగా గడపలేమనీ అనుకుంటారు. విచ్చలవిడిగా ఉంటారు. మాట్లాడుతారు. వారి సంభాషణ, ప్రవర్తన రూపామెహరాకు atrociousగా అనిపిస్తుంది. అందుకే లతను అమిత్‌ను చేసుకోమని మీనాక్షి, కకోలి సూచించినప్పుడు ఆ కుటుంబంతో మరో సంబంధమా అని ఆమె నిరసిస్తుంది.

తపన్ ఛటర్జీ ఛటర్జీ చిన్న కుమారుడు. బోర్డింగ్ స్కూల్లో ఉండి చదువుతుంటే వయసులో పెద్ద కుర్రాళ్ళు అతని మెతకనాధారం చేసుకుని బాధించేవారు. Sexual Activityకి లొంగమని బాధించేవారు. అది ఇంట్లో చెప్పుకో లేక, బాధలు పడలేక సతమత మవుతున్న తరుణంలో దీపాంకర్ అసలు విషయమేమిటని రహస్యంగా అడిగి తెలుసుకొని నిర్ఘాంతపో తాడు. అమిత్ సహాయంతో తపన్‌ను కలకత్తాలో స్కూల్లోనే చేర్పిస్తాడు. బోర్డింగ్ స్కూళ్ళలో అనూహ్యమైన సంఘటనలు జరుగుతుంటాయి. మెత్తగా ఉన్న పిల్లల్ని పెద్దవాళ్ళు, భయపెట్టి లొంగతీసుకుంటారన్నది తపన్ స్కూలు ఉదాహరణగా చెప్పుకో వచ్చు.

ఛటర్జీ కుటుంబంలో మరో చెప్పుకోదగ్గ జీవం కడిల్స్ (కుక్క). అది ఎప్పుడు ఎవరి

మీద విరుచుకు పడుతుందో, ఎప్పుడు ప్రేమ చూపుతుందో చెప్పటం కష్టం. ఆ యింట్లో ఎప్పుడూ ఏవో పార్టీలు జరుగుతుంటాయి. అతిధుల మీద దాడి చేసిన సందర్భాలుండటం వలన పార్టీలప్పుడు కడిల్స్‌ని దూరంగా ఉంచటం, కట్టేయటం చేయవలసి వస్తుంది. ఆ కుటుంబ సభ్యుల సంభాషణలో కడిల్స్ ఎన్నో సార్లు దొర్లటం వింటాం. అందుమూలంగా దాని ప్రస్తావన తేవలసి వస్తుంది.

బైతర్ నవాబు ఖాన్ (నవాబ్ సాహిబ్) మహేష్ కపూర్ మంచి స్నేహితులు. నవాబ్ సాహిబ్ అనే ఆయన్ను అందరూ అంటారు. మంచి వ్యక్తి, సాహితీ వేత్త, మంచి స్నేహితుడు. అందరూ గౌరవించదగిన వ్యక్తి. జమీందారీ ఆస్తులు తరిగిపోతున్న తరుణం అది. ఐనా నవాబ్ సాహిబ్ గుంభనగా ఖర్చులు వెళ్ళతీస్తూ ఉంటాడు. విలాసాలూ, భోగాలూ తగ్గించి ఎప్పుడూ తమ లైబ్రరీలో సాహిత్యారాధనలో గడుపుతుంటాడు. భార్య గతించింది. ఆమె జ్ఞాపకాలు నెమరు వేసుకున్నప్పుడు, వయసులో ఉన్నప్పుడు ఆమె అభిప్రాయాలను మన్నించలేదనీ, ఆమెకు తగినంత గౌరవాన్నీ ప్రేమను పంచి ఇవ్వలేదనీ మథన పడుతుంటాడు. పిల్లలన్నా, మనుమలన్నా ఎంతో ప్రేమాను రాగాలు గుండెలో నింపుకున్న వ్యక్తి నవాబ్. కొడుకులిద్దరూ తమ తమ జీవిత విధానాల్తో రాణిస్తున్నారని గర్వపడినా కూతురు జైనబ్ భర్తవల్ల, ఉండవలసి నంత సుఖంగా లేదని తెలిసి పరితపిస్తాడు. ఇద్దరు మనుమల్ని ప్రాణపదంగా చూచుకుంటాడు. వారితో ఉన్నంత సేపు తన బాధలను మరచి పోతాడు. తన స్నేహితుడు మహేష్ కపూర్ కొడుకు మాన్ తన కొడుకు ఫిరోజ్‌ను ప్రాణాపాయంగా గాయపరచాడన్న బాధతో శ్రీమతి మహేష్ కపూర్ చనిపోతే పలకరింపుకు వెళ్ళలేక పోతాడు. కాని అలా చేసి నందుకు తరువాత ఎంతో సిగ్గుపడతాడు. కోర్టులో మాన్‌కు అనుకూలంగానే సాక్ష్యం చెప్పి అతన్ని మరణ శిక్షనుండి తప్పించినప్పుడే అతనికి మనశ్శాంతి కలుగుతుంది. జమీందారీ రద్దు బిల్లుకు మహేష్ కపూర్ కారణమైనా, తను ఆస్తులు కోల్పోతానని తెలిసినా స్నేహితుని మీద కక్షకట్టని స్నేహశీలి నవాబు. హుందాగా, పెద్ద మనసుతో వ్యవహరిస్తాడు. వయసులో ఉన్నప్పుడు సయీదా బాయికి తన వల్ల పాప పుట్టటం వల్ల (తస్నీమ్) ఆమె బాధ్యత తనదిగా భావించి ప్రతినెలా కొంత పైకాన్ని ఆమె ఖర్చు నిమిత్తం పంపుతుంటాడు. ఆర్థికంగా బాధలున్నా తన బాధ్యతల్ని విస్మరించడు.

నవాబ్‌గారి కొడుకులు ఇంతియాజ్ ఖాన్, ఫిరోజ్ ఖాన్. ఇద్దరూ చక్కని రూపరులు. బారెడెత్తు యువకులు. ఇంతియాజ్ ఖాన్ డాక్టరు వృత్తి చేపట్టి, అతి మెలుకువగా వైద్యం చేస్తూ కీర్తి ప్రతిష్ఠలు సంపాదిస్తాడు. ఫిరోజ్ ఖాన్ న్యాయవాద వృత్తి చేపట్టి రాణిస్తాడు. జమీందారీ బిల్లు సందర్భంగా కోర్టులో అతని వాదన తండ్రినే ముగ్ధుణ్ణి చేస్తుంది. సయిదా బాయి కూతురైనా, చెల్లిలిగా వ్యవహరింప బడతున్న తస్నీమ్ అందానికి సమ్మోహితుడై ప్రేమలో పడతాడు. ఆమెను కలవటానికి వెళ్ళినప్పుడే మాన్ అతను సయిదాబాయి కొరకే వచ్చాడని భ్రమించి అనాలోచితంగా ఫిరోజ్‌ను ప్రాణాంతకంగా గాయపరుస్తాడు. ఐనా ప్రాణాపాయం తప్పాక మాన్‌ను ఇంటికి పిలిపించుకొని తనకేమీ అతని మీద కోపం లేదని చెపుతాడు. స్నేహితుణ్ణి శిక్ష నుండి ఎలా తప్పించగలనా అని ఒక న్యాయవాదిగా ఆలోచించి, తండ్రితో సంప్రదించి తానే తూలి కత్తి మీద పడినట్లు, మాన్ తనను గాయపరచనట్లు చెప్పి మాన్‌మీద శిక్ష ఎత్తి వేయిస్తాడు. ఈ సందర్భంగా ఫిరోజ్ ఎంతో ఉన్నతుడుగా కనిపిస్తాడు. మతకలహాల సందర్భంగా మాన్ తన ప్రాణాన్ని కాపాడటం ఫిరోజ్ ఎన్నటికీ మరవలేదు. అందువల్లనే అతన్ని ఎలా ఐనా కాపాడాలని తపన పడి, నెగ్గుతాడు. స్నేహం విలువ తెలిసిన వాడు ఫిరోజ్. ఆవేశాల్లో స్నేహాల విలువలు మరుస్తున్న ఈ రోజుల్లో ఫిరోజ్ ప్రవర్తన ముచ్చటగొలుపుతుంది. ఎంతో మంది యువకులకు ఆదర్శం కాగలవాడు ఫిరోజ్.

కుటుంబాలతో సంబంధం లేకుండా వ్యక్తులుగా మంచిగానో, చెడుగానో చెప్పుకో దగిన వారు కొందరున్నారు ఈ నవలలో.

హోం మినిస్టర్ అగర్‌వాల్ మహేష్ కపూర్‌కు వ్యతిరేకి. రాజకీయంగా ఎత్తులు, పై ఎత్తులు వేసి నిర్ణయాలు అమలు పరుస్తుంటాడు. ఫూల్ మేలా సందర్భంగా అతని నిర్ణయాలు కొందరి ప్రాణాలు తీస్తాయి. బైతర్ నవాబు వదిన గారు అసెంబ్లీలో తనను వ్యతిరేకిస్తుందని, నవాబు ఇంటి మీదకు పోలీసుల్ని పంపించి భీతావహుల్ని చేస్తాడు. ముఖ్యమంత్రి శర్మ సమయానికి అతనికి అడ్డుపడి సమస్యను అదుపు చేస్తాడు. శర్మ సెంట్రల్ గవర్నమెంటులో చేరితే, మహేష్ కపూర్ అడ్డులేకుంటే తానే ముఖ్యమంత్రి కావాలని వేచి చూస్తుంటాడు. తన కూతురు ప్రియాను ప్రాణప్రదంగా చూసుకుంటాడు. ఆమెను రోజు కొక్కసారైనా చూడనిదే అతనికి రోజు గడచినట్లు ఉండదు.

డా. కిషన్‌చంద్ సేథ్ రూపామెహరా తండ్రి. వైద్యవృత్తిలో రాణించినవాడు. మాటల్లో కొరకరాని కొయ్యగా కనిపిస్తాడు. కాని ఉబ్బేస్తే తనంతటి వాడు లేడని దయాగుణం కనబరుస్తాడు. తనమాటను ఎవరూ వ్యతిరేకించ గూడదను కొంటాడు. వయసు మళ్ళిన తరువాత తన కూతురు వయసుగల పార్వతి అనే స్త్రీని పెండ్లాడి, ఆమె సలహాలకనుగుణంగా పోతూ ఉంటాడు. చాలా హడావిడి చేస్తుంటాడు ఎక్కడ ఉన్నా. ధూం, ధాం అంటూ లేస్తాడు ఎవరన్నా ఎదురు చెప్పబోతే.

ప్రొఫెసర్ దురాని బ్రహ్మపూర్ యూనివర్సిటీలో గణిత శాస్త్రజ్ఞుడు. ఎప్పుడూ గణిత లోకం తప్ప మరో స్పృహ ఉన్నట్లు అనిపించదు - భార్య మనస్థిమితం లేని రోగి. ఈయన్ను గణిత ప్రపంచంలో నుండి బయట పడవేయలేక తానే పిచ్చిదయిందేమో తెలియదు. కొడుకులు కబీర్, హాషిమ్ అటు తల్లినీ, యిటు తండ్రినీ జాగ్రత్తగా చూసుకుంటారు. దురాని కూతురు చనిపోతుంది. ఆబాధ, భార్య పరిస్థితి దురానీని కృంగ దీసి ఉండవచ్చు. తింటున్నా, త్రాగుతున్నా గణితం ఆయన బుర్రలో కదలాడుతుంటుంది.

ఒక్క సందర్భంలో మనముందు కొచ్చే వ్యక్తి మిస్టర్ సైగల్. రూపామెహరాకు బావ వరుసవాడు. తన కూతురు వయసున్న లత తన యింటికి ఒకపూట అతిథిగా వస్తే ఆమె వెంట బడుతాడు సెక్స్ పిచ్చివాడిలా. ఆమె తెలివిగా తప్పించు కుంటుంది. తన మోహానికి చిహ్నంగా ఆమెకు ఏవో వస్తువులు బహుమతిగా యిస్తాడు. లత అతనంటే అసహ్యించుకుం టుంది. కాని ఎవరితోనూ అతని ప్రవర్తనగురించి చెప్పదు. ఇతరులు నమ్మక పోవచ్చు. అలాంటి వికారమైన స్వభావం గల వారు చాలామంది ఉంటారు మనమధ్య. సైగల్ ఒక నమూనా మాత్రమే.

సోషలిస్టు రషీదుఖాన్ తన పల్లెల్లో ఎన్నో మార్పులు తేవాలని కలలు కంటాడు. ఏమి చేయాలో ఎలా చేయాలో తెలియని అయోమయంలో కొట్టుమిట్టాడుతుంటాడు. అన్న యాక్సిడెంటులో చనిపోతే ఒక్క బిడ్డకు తల్లైన వదినను పెద్దల బలవంతంతో వివాహమాడ తాడు. మరో బిడ్డకు తండ్రి అవుతాడు. యూనివర్సిటీలో విద్యార్థిగా ఉంటూ సోషలిజాన్ని ప్రచారం చేస్తాడు. తన ఆలోచనలు క్రమబద్ధీకరించు కోటం చేతగాక, పెద్దలకు కోప కారణం అయి దారీ తెన్నూ తెలియక చివరకు ఆత్మహత్య చేసుకుంటాడు. తామాశించింది ఎలా సవ్యంగా సాధించాలో తెలియక అగాథంలో మునిగి పోతున్న అనేకమంది యువకులు ఈ నాటి సమాజంలో పెడత్రోవన బడి జీవితాలు వ్యర్థం చేసుకోటం గమనిస్తూనే ఉన్నాం.

ఈ నవలలో ప్రస్తావనకు వచ్చిన అనేక విషయాలు నేటి భారత సమాజాన్ని ప్రతిబింబించి నట్లు ఉన్నాయి. రాజకీయాలలో మోసాలూ, కుట్రలూ, ఎత్తుకు పైఎత్తులు, ప్రత్యర్థులను

చిత్తుచేయాలనే ధోరణి అగర్‌వాల్ వంటి రాజకీయవేత్తల్లో చూస్తాం. మహేష్ కపూర్ రాజకీయాల్లో మర్యాదస్తుడు, పెద్ద మనిషి. తన పార్టీ ధోరణి నచ్చక పదవీత్యాగం చేస్తాడు. కొత్త పార్టీటికెట్ మీద పోటీ చేస్తాననుకొంటాడు, కాని హితుల, స్నేహితుల సలహా మీద కాంగ్రెసు తరఫునే ఎన్నికల్లో నిలబడతాడు. తనకు గట్టి నమ్మకమున్న చోట గాక కొత్త ప్రదేశంలో పోటీ చేస్తాడు. తనను తప్పక గెలిపిస్తామన్న ముస్లింలు తనకు వ్యతిరేకంగా చేస్తారు. మాన్ కపూర్ ఎన్నికల ప్రచారం సవ్యంగా నడుపుతున్న తరుణంలో ఒక ఆవేశానికి లోనై స్నేహితుడు ఫిరోజ్ ఖాన్‌ను గాయపరచగా పరిస్థితి మహేష్ కపూర్‌కు వ్యతిరేకంగా మారుతుంది. తనను సమర్థిస్తూ ప్రచారం చేసిన వాసిం ఖాన్ తనను ఓడించటానికి ఫిరోజ్ ఖాన్ మరణించినట్లు దొంగ పోస్టర్లు వేసి మహేష్ కపూర్‌ని ఓడిస్తాడు. వాసిం ఖాన్ మీద కేసు పెట్టమని పెద్దలు సలహాయిచ్చినా కపూర్ ఆ చర్య తీసుకోడు. ఓడినా తన ప్రజలకు తోడ్పడాలని నిర్ణయించుకుంటాడు కపూర్.

ఒకప్పుడు మాన్ కపూర్ తండ్రి మీద కోపగించి రషీద్‌ఖాన్‌తో కలిసి పల్లెటూళ్ళు తిరగుతాడు. పల్లె వాతావరణం, అక్కడి పెద్దల అభిప్రాయాలు, కుర్రకారు నడవడి, అభిప్రాయ భేదాలు, అక్కడి పేదరికం అంతా నవలాకారుడు బహుకోణాల్లో వర్ణిస్తాడు. ముఖ్యంగా కొన్ని ముస్లింకుటుంబాలు, వారి జీవిత విధానం, రాజకీయంగా, సామాజికంగా వారి అభిప్రాయాలు వ్యక్తం చేస్తాడు. మనం స్వయంగా ఆపల్లెలకు వెళ్ళి చూచినంత విశదంగా వ్రాస్తాడు. హిందూ ముస్లింల సామరస్యం చూస్తాం. వారి విరోధమూ చూస్తాం.

బ్రహ్మపూర్‌లో జరిగిన మతకల్లోలం ఈ నాటి మన మధ్య జరుగుతున్న మత కల్లోలాలకు ఏ మాత్రం తీసిపోదు. నవలలో దసరా పండుగప్పుడు రామ్‌లీల ఉత్సవం, పీర్ల పండగ ఊరేగింపు ఒకే సారి జరిగి అకస్మాత్తుగా హిందూ ముస్లిం పోరాటం జరుగుతుంది. నడిరోడ్డు మీద ఒకరి నొకరు నిర్దాక్షిణ్యంగా పొడిచి చంపు కుంటారు. ఇళ్ళు తగుల బెట్టు కుంటారు. అదే సందర్భంగా మాన్ కపూర్ తన ప్రాణానికి తెగించి ఫిరోజ్ ఖాన్ ప్రాణాన్ని కాపాడుతాడు. ఆ కృతజ్ఞతతోనే తదుపరి ఫిరోజ్ మాన్‌ను కాపాడుతాడు. వారిపురి మధ్య ఎప్పటి వలె స్నేహ సౌరభం వెల్లి విరుస్తుంది.

తెల్లదొర తనం పోయి మన వారి పరిపాలనలో జరుగుతున్నవింతలూ, విశేషాలూ విస్తృత చర్చకు వస్తాయి ఈ నవలలో. మహేష్ కపూర్ జమీందారీ రద్దు బిల్లు ప్రవేశ పెట్టి నెగ్గుతాడు. అది అమలు జరగకుండా ఎలా కాపాడుకోవాలా అని రాజాలు, నవాబులు తాపత్రయ పడుతుంటారు. ఆ బిల్లు వల్ల ఎక్కువ నష్టపోయేది బైతర్ నవాబు. తొణకడు, బెణకడు. మార్ రాజా క్రూరుడు, విలాసవంతుడు. మహేష్ కపూర్ మీద కక్ష కడతాడు. ఆయన పిల్లలకు నష్టం చేయాలని ప్రయత్నిస్తాడు - డబ్బున్న పొగరు బోతు అతను. అతని కొడుకు కూడా కాలేజీలో అహంతో ప్రవర్తిస్తాడు.

యూనివర్సిటీలు, వైస్ ఛాన్సలర్లు, ప్రొఫెసర్లు కూడా క్షుద్రరాజకీయాలకు నీతి బాహ్యమైన ప్రవర్తనకూ దూరం కాదనేది ఈ నవలలో చూస్తాం. డా. ప్రాణ్ కపూర్ రీడరు సెలక్షన్‌లో ప్రొ. మిశ్రా వైస్‌ఛాన్సలరూ కుమ్మక్కై ప్రాణ్ ఇంటర్వ్యూలో బాగా చేసినా, సమర్థుడైనా, అతణ్ణికాదని ముఖ్యమంత్రి మేనల్లుడు పనికిరాని వాడైనా సెలెక్ట్ చేయబోతారు. ఇంటర్వ్యూ బోర్డులోని బయటి మెంబర్లు అడ్డుపడి (అలాంటిది ఇప్పుడు జరగటం అరుదు). ప్రాణ్ కపూర్ సమర్థవంతుడని నిర్ణయిస్తారు. ఆశ్రిత పక్షపాతం, స్వార్థ ప్రయోజనాల దృష్ట్యా ఈనాడు ఇలాంటి అవకతవకలు సమాజంలో అన్ని రంగాలలో జరుగుతున్నాయి. బలం, పలుకుబడి గలవాడి బంధువు ఎంత పనికి మాలిన వాడైనా సమర్థవంతుడుగా, గొప్పవాడుగా చలామణి అవటం చూస్తున్నాం.

రాజాలు, జమీందార్లు కళా పోషణ పేరుతో వేశ్య వృత్తిని పోషించే వారు. సయీదాబాయి వేశ్య వృత్తి ఇతి వృత్తంగా ఈ పరిస్థితి వర్ణింప బడింది. వేశ్యకుకూడా మనసుంటుందని ఇక్కడ నవలా కారుడు చూపుతాడు. సయీదాబాయి కేవలం గాయని వృత్తి చేపట్టిన అందగత్తేగాక, మాన్ కపూర్‌కి శిక్ష పడుతుందంటే ఎంతో చిత్ర హింసకు గురవుతుంది. అతన్ని ఎలా ఐనా కాపాడాలని తాపత్రయ పడటం చూస్తాం.

తన బిడ్డను కారణాంతరాల వల్ల చెల్లెలుగా చెపుతూ ఆమె మీద చెడునీడ పడకూడదని ఆమె అహర్నిశలూ కృషి చేస్తుంది.

కొన్ని వృత్తులు ఇప్పటికీ తక్కువ స్థాయివిగా పరిగణిస్తుంది సమాజం. ఈ నవలలో చెప్పుల, బూట్ల తయారీ, చర్మ పరిశ్రమను కొంచెం హీనంగా పరిగణించి నట్లు నవలా కారుడు వ్రాస్తాడు. హరీష్ ఖన్నా ఇంగ్లండులో చదివి ఘూ కంపెనీలో పని చేస్తాడు. అతణ్ణి చెప్పులు కుట్టేవాడు అని అరుణ్ మెహరా (పెద్ద చదవులు చదివిన వాడే) ఈసడిస్తాడు. చెప్పులు కుట్టేవాళ్ళు ఉండే పరిసరాలూ, వారి ఆర్థిక స్థితి చాలా దయనీయంగా ఉంటుంది ఈ నవలలో.

చెక్‌వారు భారతీయుల పనిపట్ల చులకన భావం వ్యక్తం చేస్తారు. ప్రాహాపూర్‌లోని చెక్ కొలాబరేషన్‌లో నడుస్తున్న ఘూ కంపెనీలో ఉన్నతపదవులు నిర్వహిస్తున్న చెకోస్లోవియా వారు భారతీయులు ఎక్కువ మాట్లాడుతారు, తక్కువ పని చేస్తారని ఈసడిస్తారు. చాలా మట్టుకు ఈ విమర్శ సరి అనిపిస్తుంది. మనం మాటల్లో చూపే చరుకు పనిలో చూపమేమో! మాటల్లో ఎక్కువ కాలాన్ని వృధా చేస్తాం.

ఈ నవలలో తక్కువగా ముచ్చటించింది సెక్స్ గురించి. సయీదాబాయి దగ్గరకూడా ఆ విషయం సూక్ష్మంగా చూపబడుతుంది. మిగతా విషయాలకున్న ప్రాధాన్యత సెక్స్‌కు ఈ బృహత్ నవలలో ఇవ్వలేదు. సయీదాబాయి, తస్నీమాబాయి తమ వద్దకు వచ్చే విటుల సెక్స్ వికారాల గురించి మాట్లాడినప్పుడు గూడా సూక్ష్మాతి సూక్ష్మంగా మాట్లాడి నవ్వుకుంటారే తప్ప వికారంగా రూపొందించరు. మీనాక్షి మెహరా తన భర్త స్నేహితుణ్ణి బలవంతంగా Sex Game లోకి దింపుతుంది. ఆ విషయం అతి తక్కువగా చెప్పబడుతుంది. సమాజ జీవితంలో అన్ని రంగాలను ఈ నవల స్పృశిస్తుంది.

(A Suitable Boy, రచన : విక్రమ్‌సేఠ్; పేజీలు : **1349**, వెల : రూ. **500/-**,
ప్రచురణ : వైకింగ్, పెంగ్విన్ బుక్స్ ఇండియా (పి) లిమిటెడ్.)

---

## MORE EQUAL

As Betrand Russell, a genuine socialist, writes in his The Practice and Theory of Bolshevism (1920), "Bolshevism is internally aristocratic and externally militant. The Communists in many ways resemble the British public school type. Most of them have better food than other people. In a thousand ways, the Communists have a life which is happier than that of the rest of the community." The point was more picturesquely made by George Orwell in his Animal Farm (1945) where we have the oft-quoted sentence "All animals are equal but some animals are more equal than others". Perhaps we have an instance of this phenomenon in some of the plump Bengali Marxists who hold political power.

సమీక్ష:

# ప్రేమించడం ఒక కళ

**Art of Loving**
**By ERICH FROMM**

– అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

ప్రేమ విచ్ఛిత్తికి అనేకమైన ప్రత్యేక రూపాలున్నాయి. ఇవి మనిషి అచేతనంగా పడేబాధలో కనిపిస్తాయి. మనోరోగ చికిత్సకులు, మామూలు జనం వీటిని నాడీరుగ్మతల క్రింద పరిగణిస్తున్నారు. మనకు తరచు కనిపించే రూపాలను క్లుప్తంగా ఈ దిగున పొందుపరుస్తున్నాము.

''ప్రేయసీ ప్రియుల''లో ఒకరుగాని, ఇద్దరుగాని తల్లి లేదా తండ్రి ఆకృతి (figure)కి బందీలై, ఒకనాటి బాల్యంలో తల్లి లేదా తండ్రిమీద ఉన్న భయద్వేషాలను, రాగవిరాగాలను ఆశా నిరాశలను ఇప్పటి వయస్క జీవితంలో ప్రేమింపబడిన వ్యక్తి మీదికి బదిలీ చేయడం న్యూరోటిక్ ప్రేమకి ప్రాథమిక లక్షణము. ఇందులో చిక్కుకుపోయిన వ్యక్తులు బాల్య నమూనానుంచి ఎప్పటికి బయట పడలేరు; ఇదే నమూనాను వయోజన ప్రేమానసరాలలో ప్రదర్శిస్తారు. ఇటువంటి సందర్భాలలో వ్యక్తివయస్సు ఎంతైన, ప్రేమపరంగా రెండు లేదా ఐదు లేదా పండ్రెండు సంవత్సరాల బాలుడుగానే మిగిలిపోతాడు. కాని ఇతర సాంఘీక సంబంధాలలో, తెలివతేటల్లో, వ్యాపారదక్షతలో శారీరక వయస్సుకు తగినట్లే (అప్పటి వయస్సు అనుభవానిక తగినట్లే) ప్రవర్తిస్తాడు. తీవ్రంగా చిక్కుకుపోయిన సందర్భాలలో మాత్రం ఈ జేద్వేగిక అపరిపక్వత (emotional immaturity) వారి ఇతర సాంఘిక సంబంధాలను గూడా బలహీనం కావిస్తుంది; అంత తీవ్రంగా లేని సందర్భాలలో, ఘర్షణ సన్నిహిత వ్యక్తిగత సంబంధాలకే పరిమితమవుతుంది.

తల్లిని లేదా తండ్రిని కేంద్రంగా చేసుకొని వికసించిన మూర్తిమత్వాన్ని గురించి మనంలోగడ చేసిన చర్చను బట్టి చూస్తే, ఈరకమైన న్యూరోటిక్ ప్రేమబంధం, శైశవబద్ధరాగంతో తల్లికి అంటిపెట్టుకుపోయిన మగవారిలో ఎక్కువగ కానవస్తుంది. వీరు తల్లి స్తన్యాన్ని ఎన్నటికి వీడని మగవారు. వీరు, తామింక చిన్నపిల్లలమనే అనుకొంటారు. తల్లి రక్షణ, ప్రేమ వేడి, ఆపేక్ష మెప్పుకోళ్ళకోసం ఆక్రోశిస్తారు. వీరికి అవసరాలున్నాయని, వీరు తల్లిబిడ్డలమని, నిస్సహాయులనే కారణాన తప్ప మరొక విధంగా లభ్యంకాని ప్రేమను, నిర్నిబంధమైన తల్లి ప్రేమను కావాలంటారు. అటువంటి పురుషులు స్త్రీని వలపింపచేసేటప్పుడు, అతరవాత గూడ, ఆమెయెడ ప్రేమానురాగాలను ప్రదర్శించగలరు. కాని ఆ స్త్రీతో వారి సంబంధం ఇతరులతోవలెనే లోతుగా ఉండదు, బాధ్యతారహితంగా ఉంటుంది. వీరి లక్ష్యం ప్రేమించబడడమేగాని ప్రేమించడంకాదు. ఈరకం మగవానిలో మామూలుగ అహంకారం, అంతరంగ పటాటోపం ఉంటుంది. సరైన స్త్రీ దొరికితే భద్రత అనుభవిస్తారు! ప్రపంచ శిఖరాగ్రాన ఉన్నామని భావిస్తారు, ప్రేమాదరాలను ఎంతగానో ప్రదర్శిస్తారు. ఈ కారణాన వీరు తరచు భ్రమకారకులవుతున్నారు. కాని కొంతకాలం పిదప, ఆస్త్రీ వారికలలకు తగినట్లు ఎదగలేదని గ్రహించినప్పుడు ఘర్షణలు, కోపతాపాలు రాజుకొంటాయి. ఆస్త్రీ అతనిని ఎప్పుడూ మెచ్చుకోకపోయినా, ఆమె తనను ప్రేమించాలని, రక్షించాలని కోరినా,

కొన్ని విపరీత సందర్భాలలో ఇతరస్త్రీలతోడి అతని ప్రేమకలాపాలను ఆమె క్షమించకపోయినా, ఆస్త్రీలను మెచ్చుకోవడంలో అమె అలక్ష్యంచేసినా అతడు విపరీతంగా గాయపడతాడు, నిరాశచెందుతాడు. అతడు మామూలుగ ఈబాధను ''ఆమె తనను ప్రేమించడంలేదని, వట్టి స్వార్థపరురాలని, వట్టి కరోడా,'' అని నచ్చచెప్పుకోవడంతో సరిపెట్టుకొంటాడు. ప్రేమమూర్తి అయిన తల్లి తనగారాబు పట్టి యెడచూపించే అనురాగానికి ఏమాత్రం తక్కువగా ఉన్నా దానిని ప్రేమరాహిత్యానికి నిదర్శనంగా పరిగణిస్తాడు. ఈ మగనారు తమ అనురాగ ప్రవర్తనను, ఇతరులను తృప్తి పరచాలనే కోర్కెను, వాస్తవప్రేమతో కలగపులగం చేస్తారు. అందరూ తమను అన్యాయంగా చూస్తున్నారనే నిర్ణయాని కొస్తాడు. తామెంతో గొప్ప ప్రేమికులమని భావించి, ఆమె తమయెడ కృతఘ్నతను చూపిస్తున్నదని గోల పెడతారు.

తల్లి కేంద్రంగా పెరిగినటునంటి కొద్దిమంది వ్యక్తులు మాత్రమే తీవ్ర వ్యాకులత వాతపడకుండ తప్పించుకో గలుగుతారు. అతని తల్లి అతనిని అతిగారబంతో ''ప్రేమించి'' నట్లయితే (వినాశకరంగాని ఆధిపత్యాన్ని చెలాయించినప్పటికి), అదేరకం తల్లికోవకు చెందిన భార్య దొరికినట్లయితే, అతడు తనవిశిష్ట ప్రతిభావ్యుత్పత్తులను, మనోజ్ఞతను ప్రదర్శించి మన్ననలను పొందితే (కొందరు పేరుమోసిన రాజకీయవేత్తల విషయంలో ఇదే జరుగుతుంది) ఉన్నతస్థాయి పరిణతికి చేరకుండానే, సాంఘికార్థంలో అతడు ''బాగా ప్రవర్తించినట్లే లెక్క.'' కాని ఇంతకంటె తక్కువ అనుకూల పరిస్థితులలో కూడా ఇదే తరచు సంభవిస్తుంటుంది. అతని సాంఘిక జీవితం కాకపోయిన, అతని ప్రేమైకజీవతం తీవ్రనిరాశకు గురి అవుతుంది. ఇటువంటి వ్యక్తిని ఒంటరిగా వదలివేస్తే, ఘర్షణలు, తీవ్రవైకల్యాలు, అవసాదాలు. (depressions) ఎదురవుతాయి.

ఇంతకంటె ఇంక ఎక్కువ అనారోగ్యంగా ఉన్నప్పుడు తల్లిమీద కేంద్రీకరణ చాలాలోతుగ, అహేతుకంగ (గుడ్డిగ) ఉంటుంది. ఈ స్థాయిలో అతని వాంఛ, ప్రతీకాత్మకంగా చెప్పాలంటే, సురక్షితమైన తల్లివడిని చేరడమూకాదు, పాలిచ్చే స్తనాన్ని అందుకోవడముకాదు, కాని సర్వగ్రాహకమైన - సర్వనాశకమైన - గర్భాశయాన్ని చేరాలని. గర్భాశయంనుంచి వెలుపలి ప్రపంచంలోకి పెరగడం ఆరోగ్యలక్షణమైతే, బయటి ప్రపంచంనుంచి గర్భాశయంలోకి ఆకర్షింపబడడం, అందులోకి తిరిగి లాగబడడం తీవ్రమానసిక అనారోగ్యము. గర్భాశయంలోకి తిరిగి ఆకర్షింపబడడమంటే జీవితంనుంచి దూరంగా తీసుకువెళ్ళడను. తల్లులు, తమ పిల్లలకు, ఈరకమైన వాతావరణంలో పెంచినట్లైతే, అటువంటి తల్లుల సంబంధంలో ఈరకమైన స్థిరీభవనం (Fixation) జరుగుతుంది. కొన్నిసార్లు ప్రేమ పేరుతో, మరి కొన్నిసార్లు విధిపేరుతో బిడ్డను, వయస్కుని, ఇంకా పెద్దవానిని తల్లులు తమ అదుపులోనే ఉంచుకొంటారు. అటువంటి సంతానం తల్లిద్వారాతప్ప గాలినిగూడ పీల్చవీలులేదు. అలా పెరిగిన యువకుడు, భార్యను లైంగికంగా పైపైన మాత్రమే పాల్గొనడంతప్ప, లోతుగ ప్రేమించలేడు, ఎప్పటికీ నేరస్తుడుగా అవిటివాడుగ తప్ప స్వేచ్ఛావాయువులను పీల్చలేడు. వినాశకరమైంది, మ్రింగివేసేది అయిన తల్లియొక్క ప్రభావం తన ఆకృతికి విరుద్ధపక్షము, (Negative aspect of mother figure), తల్లి ప్రాణాన్ని ఇవ్వగలదు; తీయగలదు, పునరుజ్జీవింపజేసేది ఆమే, నాశనంచేసేది ఆమే; ఆమె ప్రేమతో అద్భుతాలను చేయగలదు-ఆమె

బాధించినంతగా మరొకరు బాధించలేరు. మత్తైక ప్రతిమలలో హిందువుల కాకవలె స్వప్న ప్రతీకలలో తల్లియొక్క ఈ రెండువిరుద్ధరూపాలు కనిపిస్తాయి. యీఅనురాగం పితృబద్ధమైన సందర్భాలలో మానసిక అనారోగ్యంయొక్క, మరొకరూపం కనిపిస్తుంది.

ఈ అనారోగ్యరూపాన్ని వివరించే ఉదాహరణలో, తల్లి నిరాదరంగా నిరాసక్తంగా ఉంటే, తండ్రి తల్లి నిరాదరణ కారణంగా తన ఆదరాభిమానాల నన్నింటిని కొడుకుమీద కేంద్రీకరిస్తాడు. అతడు ''మంచి తండ్రే'' కాని అదేసమయంలో అధికారాన్నిగూడ చెలాయిస్తాడు. కొడుకు ప్రవర్తనకు సంతోషించినప్పుడెల్ల అతనిని మెచ్చుకొంటాడు. అతనికి బహుమతులిస్తాడు. వాత్సల్యం కురిపిస్తాడు; కొడుకు ప్రవర్తన కష్టం కలిగిస్తే, అతడు దూరమవుతాడు, కసురుకొంటాడు. తండ్రినుంచి తనకు లభించేది వాత్సల్యం ఒకటే గనుక కొడుకు దాసపద్ధతిలో తండ్రికి బద్ధుడవుతాడు. అతని జీవిత లక్ష్యం తండ్రిని సంతోషపెట్టడమవుతుంది - అదు సఫలీకృతుడైనప్పుడెల్ల సంతోషపడతాడు. భద్రతను, తృప్తిని పొందుతాడు. కాని అతడు తప్పుచేసినప్పుడు, తండ్రిని సంతోష పెట్టలేకపోయినప్పుడు, తానొక గడ్డిపోచనైనట్లు, తననెవరు ప్రేమించడం లేదని, తన నందరు వదిలివేశారని క్లేశపడతాడు. తరువాత జీవితంలో ఇటువంటి పురుషుడు అదే పద్ధతిలో (దాసపద్ధతిలో) బంధించుకోనడానికి తగిని పితృ ఆకృతి (father figure)ని వెతుక్కొంటాడు. తండ్రి మెప్పును పొందడంలో గలిగిన జయాపజయాలను బట్టి అతని జీవితం గతుకుల మయమవుతుంది. అటువంటి మగవారు తమ సామాజిక పాత్రలను చక్కగానే నిర్వహిస్తారు. ఎంచుకొన్న తండ్రిప్రతిమ (chosen father figure) వారిలో ఎలా మెలగాలో అర్థం చేసుకుంటే వారు ఋజువర్తనలు, నమ్మకస్తులు అవుతారుగాని, వీరు స్త్రీలకు మాత్రం దూరంగా, వేరేగా ఉంటారు. వీరి దృష్టిలో స్త్రీ ''పరమార్థం'' (central significance) కాదు; మామూలుగ వీరికి ఆమె అంటె తిరస్కారము; ఈ తిరస్కారం, తండ్రి చిన్నపిల్లల యెడచూపించె ఆపేక్షలాంటి ముసుగు ధరిస్తుంది. ఒకస్త్రీని, మొదట్లో వీరు తమ పురులక్షణంతో ఆకట్టుకోవచ్చు కాక. కాని వీరిని పెళ్ళిచేసుకొన్న ఆస్త్రీ, తన భర్త జీవితంలో పితృ ఆకృతికి ప్రథమస్థానమని, తనకు రెండవస్థానాన్ని నింపవలసిన దుర్గతి పట్టిందని ఎప్పుడైన గ్రహిస్తే, ఆమెకు నిస్పృహ కలుగుతుంది. కాని ఆస్త్రీగూడ పితృబద్ధురాగిణి అయి ఉంటేతప్ప, చపలచిత్త అయిని బిడ్డను చూసినట్లు తనను చూసే భర్తతో ఆమె సుఖించలేదు.

పరస్పరం ప్రేమలేని తల్లిదండ్రుల జంట ఒకరకం. అలాగని వారు బహిరంగంగా పోట్లాడుకోరు (పైకి బాగానే ఉంటారు). తమ అసంతృప్తిని ఏరకంగాను బయపెట్టుకోరు. ఇటువంటి తల్లిదండ్రులున్న బిడ్డకు కలిగే (అనారోగ్యం) న్యూరోటిక్ ప్రేమ మరింత క్లిష్టంగా తయారవుతుంది. అదే సమయంలో, వారిమధ్య ఉన్నదూరం (remoteness) వారికి బిడ్డలతో ఉన్న సంబంధాలలోని స్వచ్ఛతను నాశనం చేస్తుంది. అటువంటప్పుడు బిడ్డకు లభించేది నిర్దోషత (పొడి-) వాతావరణానుభవం మాత్రమే. కాని ఈవాతావరణం ఇటు తల్లితో అటు తండ్రితోగాని సన్నిహిత సంబంధానికి అనుమతించదు. అందుకని బిడ్డ కలవరం చెంది భీతావహలమవుతుంది. తల్లిదండ్రులు ఏమనుకొనేది, ఏమనుభవించేది ఆబిడ్డకు ఇదమిద్ధంగా తెలియదు. ఆ వాతావరణంలో ఎప్పుడూ ఏదో ఒక అజ్ఞాతవిషయం ఒకమార్మిక విషయం ఉన్నట్లు ఆ బిడ్డకు అనిపిస్తుంటుంది. ఫలితంగా ఆబిడ్డ జీవితం తనస్వంత

ప్రపంచంలోకి, పగటికలలోకి ఉపసంహరించుకొని వాస్తవానికి దూరంగా జరుగుతుంది. తరువాత తన భవిష్య జీవితంలో ప్రేమ సంబంధాలలో ఇదే దృక్పథాన్ని అలవర్చుకుని అంటిపెట్టుకొని ఉంటుంది.

అంతేకాక, ఈ ఉపసంహరణ వాస్తవప్రపంచం నుంచి ఊహాలోకాల్లోకి ఉపసంహరించు కోవడం. ఒకరకమైన తీవ్ర వ్యాకులతకు, ఈ ప్రపంచంలో గట్టిగ నిలదొక్కు కోలేదనే సంవేదనకు దారితీస్తుంది. తీవ్ర ఉద్రేకాన్ని అనుభవించడానికి ఇదొక్కటే మార్గమున్నట్లు, ఇది తరచు స్వపీడన కామప్రవృత్తి (Maso chistic tendencies) తనను హీనంగా చూడబడి, భాగస్వామి చేతిలో బాధింపబడడంవలన లైంగిక తృప్తిని పొందలేని రోగగ్రస్తస్థితికి దారితీ స్తుంది. ఎక్కువగ అటువంటి ఆడవారు పెద్దగా అరచి గోలపెట్టి నలుగురిని పోగుచేసేమగ డంటే ఇష్టపడతారు. వీరు అర్థవంతంగా ప్రవర్తించే సామాన్యమైన మగడంటే ఇష్టపడరు. ఎందుకంటే అది ఆమెలోని బిగువును (tension) భయాన్ని తొలగిస్తుంది. తనను బాధించే ప్రేమ తాటస్థ్యాన్ని (affective neutrality) తనకు తెలియకుండానే అటువంటి ప్రవర్తనను మగవారిలో రేకెత్తిస్తారు. ఎక్కువగ కనిపించే ఇతర అంధప్రేమ (Irrational love) రూపాలు దిగువ పొందుపరుస్తున్నాము. కాని ఈ రూపాలకు మూలకారకాలైన విశిష్టతైన విషయాల విశ్లేషణకు పూనుకోము.

తరచు మనకు ఎదురయ్యేది, సినిమాలలో, నవలలో ''మహాప్రేమ'' (great love)గా కీర్తింపబడేది, భావించబడేది ఆరాధన ప్రేమ (idolatrous love), తన అంతఃశక్తుల సృజనా త్మక వికాసంలో పాదుకొని ఉన్న తాదాత్మ్యభావాన్ని (తనను తాను గుర్తించడాన్ని) అహంతో నేను అనే భావాన్ని (I-ness) ను గుర్తించే స్థాయికి ఎదగని వ్యక్తి మాత్రమే ప్రేమించిన వ్యక్తిని ''ఆరాధించ'' పూనుకొంటాడు. తన శక్తులకతడు దూరుడై, వాటినే పరమార్థంగా ఎంచుకొనే సర్వ, ప్రేమానందకాంతిమూర్తిగా ఆరాధింపబడిన ప్రేమికునిలో దర్శిస్తాడు. ఈ ప్రక్రియలో తన బలమంతా వంచితమైపోగా ప్రేమికునిలో తన్నుతాను దర్శించడానికి పోగొట్టుకొంటాడు. మామూలుగ, ఏ వ్యక్తిగూడ అతని (లేక ఆమె) ఆరాధకుని ఆశలకనుగు ణంగా పెరగలేరుకనుక నిరాశ నెలకొనక తప్పదు, విరుడుగా మరొక సినీమాలో లేక నవలలో నాయకుడిని ఆశ్రయించక తప్పదు. ఒక్కొక్కమాటు ఇది అనంతవలయంగా సాగుతుంది. ప్రారంభంలో ప్రేమానుభవం తీవ్రంగాను, ఆకస్మికంగాను ఉండడం ఈ ఆరాధనప్రేమ ముఖ్యలక్షణము. ఈ ఆరాధన ప్రేమను తరచు నిజమైన ప్రేమగా, మహా ప్రేమగా అభివర్ణించు కుంటారు. కాని అది ప్రేమ గాఢతను, లోతును ప్రతిబింబించవలసి ఉండగా ఆరాధకుని ఆకలిని, నిరాశను మాత్రమే ప్రదర్శిస్తుంది. ఇది ఇద్దరు వ్యక్తుల పరస్పరారాధనలో అరుదైన విషయమేమీకాదు. అటువంటి కొన్ని విపరీతమైన సందర్భాలలో ఇది ''ఒకే భ్రాంతిని పంచుకొనే ద్వంద్వవ్యక్తుల'' త్రాన్ని ప్రతిబింబిస్తుంది. (సశేషం)

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi
Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20.
Ph. 612436, 612337.
Editorial NE T
Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717